Registered No. M-4484.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] 1942 వ సం॥ జూలై నెల 10 వ తేది శుక్రవారం [నె 27 రు.

## యుద్ధ విమర్శ - విశేషాలు

**ఈజిప్టు.**

ఈజిప్టులోని పరిస్థితులు కొన్నిరోజుల క్రిందట కన్న యిప్పుడు చాల ఆశాజనకంగానున్నవని సైనిక విమర్శకు డొకడు నుడివెను. బ్రిటిషువారి స్థానాలు దిట్టంగానున్నాయి. జనరల్ అకింలేకుగారి వ్యూహం బాగా సాగుచున్నది. రోమెలు (జర్మను) సేనాని పురోగమనం అడ్డుపడింది. అయినను ఎడారి యుద్ధంలో ఏ క్షణం ఎటుమారునో చెప్పలేము. రోమెల్‌ను ఎక్కడున్నాడో అక్కడ నిలిపివేసినంత మాత్రాన చాలదు, అకింలేకు సేనాని తెలిపినట్లు "అతన్ని నాశనం" చేయాలి. పడమటి ఎడారియందును, ఈజిప్టులోను నేటి పరిస్థితులకు కారణాలరయుట యుక్తము.

గత శీతకాలంలో జపాను అతివడిగా విజయాలు పొందుతూవుంటే, జర్మనీ ప్రారంభింపనున్న వసంతదాడిగురించే అందరాలోచింపసాగిరి. జర్మనీకున్న చిక్కులు జర్మనీకున్నాయి. స్వదేశంలో చిక్కులతోబాటు, ఆక్రమిత దేశాలలో, జర్మను సైన్యమూ గూఢచారుల దళమూ పెట్టుచున్న బాధలకు ప్రజలు నిరశించుచు తిరుగుబాటు చేయుచుండిరి. ఏదో తప్పు జరుగబట్టే జర్మను మంత్రులను, సేనానాయకులను మార్చిరి. కాని అంతమాత్రం జర్మనీ కృంగిపోవునని ఎవ్వరను కోలేదు. సంయుక్త రాజ్యాలు కోలుకొని తిరుగబడులోపున యుద్ధం ముగించుటకు జర్మనీ అమిత తొందరపడుచుండెను. రష్యా రంగంలో గెలుద్దామనుకున్న హిట్లరు గెలువలేకపోయెను గనుక, ఆతడు అటుండి యిటు తిరిగి వేరొకసారి ఇంగ్లాండుపై దాడిచేయుటకు ప్రయత్నించునని ఎంచబడెను. కాని రాయలు విమానదళం వారి చొరవయు, బ్రిటిషువారి ఘట్టి దిగ్బంధము, రష్యా సేనలు జర్మను సేనలకు ఊపిరాడకుండ తీవ్రనిరోధం చేయుట, యివన్ని గూడి బ్రిటనుపై దాడి కొనసాగనీయలేదు.

ఇట్టి పరిస్థితులలో జర్మనీ శీతకాలమునందు తాను వెనుదగ్గి నిలచియున్న తావులు వీడకుండ, రష్యా తిరుగుదాడులను ఎదుర్కొనుటకు శ్రద్ధ వహించుట తోబాటు, ఆఫ్రికా ప్రాంతములందు వసంత ఋతువులో దాడి ప్రారంభించుటకు ఎక్కడ అనువుగా నుండునా యని వెదకుచుండెను. ఆ ఉద్దేశంతోనే టర్కీని బెదరకొట్టుచు ప్రచారంచేసి, మధ్యధరా సముద్రమంతా గాలించి, కాలూనుటకు తావు వెదకుచుండెను. ఫ్రాంసులో కుట్రలు పన్ని ఒత్తిడిచేసియు, మాల్టా పయి మెరుపుయుద్ధం జరిపియు, క్రీటు గ్రీకు దీవులకు క్రొత్త సైన్యాలు పంపియు, మధ్యధరా సముద్రంపై కాన్వాయి నావల జట్లు

## చీనా యుద్ధం 6 వ వార్షికం.

10 లక్షలు చావు, 15 లక్షల గాయాలు—
జపాను నష్టం.

చీనాపై జపాను యుద్ధం ప్రారంభించి 5 సం॥లు ముగిసి 6 వ వార్షికం యీ నెల 7 వ తేదీన జరిగెను. ఈ సందర్భంలో చీనా జపానుకి కలుగజేసిన నష్టంగూర్చి చీనా సేనానాయకుడు యిట్లు దెలిపెను :—

10 లక్షలమంది జపానీయులు హతులైరి. 15 లక్షలు గాయపడిరి. 29,924 ఖైదీలు. ట్రొఫీలుగా పట్టుకొనబడిన వస్తువులు 7,469,913. ఈ 5 సం॥లలో 14 పెద్ద యుద్ధాలు, 10,375 గోరిల్లా యుద్ధాలు జరిగేయి. 30 కాల్బలం డివిజనులు, ఒక ఆశ్వికదళం, 15 ప్రత్యేక రెజిమెంట్లు, సుమారు 1,000 విమానాలు, జపాను వారివి చీనానుండి కదలకుండ చేయబడినవి. ఇపుడు చీనా యుద్ధరంగంలో 8 నుండి 9 లక్షల జపాను సేనయున్నది. మంచూరియా బర్మాలో నున్న జపాను సైన్యం లెక్క యిందు కలపలేదు.

పంపియు, జర్మనీ తన కార్యం నెరవేర్చుకొన గలిగెను. ఇంత చేసినా జర్మనీ వసంతదాడి ప్రారంభించ లేకపోయింది. జపాను దూర ప్రాచ్యంలో గెలుస్తున్నపుడు తానిక్కడ చొరవ చేసి క్రొత్త యుద్ధం ప్రారంభించలేకపోయింది. ఈ వ్యవధి సంయుక్త రాజ్యాలకు బాగా ఉప యోగపడింది.

ఇండియాలో ధైర్యం

ఈ పరిస్థితులు ప్రజలకు కాస్త ధైర్యం కలిగించినవి. ప్రమాదం తగ్గిపోయిందనుకుంటున్నారు. బర్మా పోవడం ఘట్టి దెబ్బే యని ఇండియాలో అనుకుంటున్నారు ; కాని కోరలు దీవులందు విడ్వే దీవులందు నౌకాదళ విజయములును, బంగాళాఖాతంలో జపాను తొలి విజయముల ననుసరించి వెంటనే దాడిచేయలేకపోవుట బట్టియు, మహాప్రమాదం తప్పిపోయిందనే భావం ప్రజలలో బాగా వ్యాపించింది. అయినా గత మూడు నెలలలో ఇండియా రక్షణలు యిదివరకు కన్న దిట్టం చేయబడినవి. జపాను మంచి విలువగల శిబిరాలను, కేంద్రములను వశపరచుకొంది. వాటినుండి దాన్ని తొలగించాలంటే సంయుక్త రాజ్యాల బలమంతా వినియోగించవలసియుంటుంది. ఈలోగా పడమరను యింత కాలం వాయిదా బడిన జర్మను వసంతదాడి అమిత శక్తివంతంగా ప్రారంభమయి, యీ ప్రపంచ యుద్ధంలో ముఖ్య ఘట్టం చేరువయింది. ఈ ఘట్టం అక్షరాజ్యాలకు మరింత ప్రమాద కరంగ నుండగలదు.

ఈజిప్టు 1940-42

1940 వ సం॥ జూనులో ప్రారంభమయిన ఈజిప్టు యుద్ధం యిపుడు తీవ్రరూపం దాల్చింది. ఇటలీ సైనికులు గ్రాజియనీగారి నాయకత్వమున 1940 వ సం॥ సెప్టెంబరు 15 వ తేదీన ఈజిప్టు సరిహద్దు దాటిరి. అదే రోజున హిట్లరు బ్రిటిషు రేవులపైని, విమానాశ్రయాలపైని, నగరాలపైని అతిమోపైన విమానదాడులు ప్రారంభించెను. మూడు రోజులలో అలగ్జాండ్రియా నగరం ప్రవేశిస్తానని గ్రేజియానీ ప్రకటించియుండెను. జనరలు వేవెలుగా రాతసి జోశ్యం వమ్ముచేసిరి. తెగింపుచేసి, సమయం చూసుకొని దెబ్బవేసి ఆతడు గ్రేజియానీ ఎత్తులు భగ్నంచేసెను. 1940 లో వలెనే యిపుడుగూడ ఆఫ్రికా యుద్ధం బ్రిటనులో యుద్ధం పైని, యితర రంగాలలో యుద్ధంపైని ఆధారపడి యుండును. ఎస్సేను నగరంపై బాంబులు వేయడం, మిడ్వే దీవులందు నౌకా యుద్ధంకూడ ఉత్తరాఫ్రికా యుద్ధంతోను, దక్షిణ రష్యాలో పోరుతోను సంబంధంగలవే. ఒక జర్మను కర్మాగారంపై రాయలు విమానాలు సూటిగా యిపుడు బాంబులువేసి నాశనంచేసిన ఫలితం, కొన్నినెలల తరువాత జపాను జర్మనీల మధ్యనున్న విశాల భూభాగంపై జరుగు యుద్ధంలో ఆయుధాలు చాలనపుడు తెలియగలదు.

ఈజిప్టుపై అక్షరాజ్యాల దాడిలో 1940 దాడికి 1942 దాడికి ఒక ముఖ్యమయిన భేదం కలదు. హిట్లరు తూర్పునకు తిరిగి యూరోపులోను యింకా దూరంలోను క్రొత్త దాడులు ప్రారంభించుటకు వీలుగా నుండుటకై, అదివరకే నలిగియున్న ఇంగ్లాండును కలతపెట్టుటకు 1940 లో ఈజిప్టు దాడి ఇటలీ ప్రారంభించెను. కాని 1942 లో ఈజిప్టుపై జర్మనీ దాడికి వేరే ప్రయోజనంగలదు. అదివరకు అక్షరాజ్యాల ప్లానులు సరిగా సాగియుంటే యిపుడు ఈజిప్టు యుద్ధం జరిగేదే కాదు. దురాశతోను, విపరీత పరిస్థితుల వలన యిరుక్కుపోయిన యిరుకునుండి తప్పించుకొనుటకు జర్మనీ చేస్తున్న యత్నాలలో ఈజిప్టు యుద్ధం ఒక భాగమే. రష్యాలో మిత్రమండలి సహాయంవలన విజయం చేకూరుచున్నది. జర్మనీ తన శత్రువును నాశనం చేయాలి లేదా తానే దగ్ధం కావాలి. అక్షరాజ్యాలకు ముఖ్య ప్రతిబంధకం కాలం సరిగా లేకపోవుటే.

ఇప్పటి స్థితి.

జర్మనీ తన శత్రువులను విడివిడిగా ఒకరితరువాత నొకరినికాక కలసియున్న అందరిని ఒకేసారి ఎదుర్కోవలసివచ్చింది. ఈ వేసంగిలో హిట్లరుని ఎన్ని ప్రతిబంధకా లెదుర్కొన్నవో చూడండి. రష్యా తిరుగుబాటు ఆకస్మికంగా తీవ్రతరమయింది ; రాయలు విమానదళంవారి వేయేసి విమానాల దాడులను ఎదుర్కోవలసివచ్చింది, బహుశ యూరోపులో బ్రిటిషు సేన దిగుతుందేమో కూడా. అమెరికా నౌకాదళం, వర్తక నౌకలతోగూడ అట్లాంటికు సముద్రంలో పోటీ చేయవలసియుంది ; ఇన్నింటితోబాటు ఆఫ్రికాలో ఇటలీ చేయలేని కార్యము తాను పూనుకొన్న పని, పూర్తిచేయాలి. దూర ప్రాచ్యంలో జపాను దాడి బ్రిటిషు సేనల దృష్టిని

మరల్పగల్గినది. బ్రిటిషువారు యీ దేశానికి పంపిన సరకు నౌకల కాన్వాయి సురక్షితంగా ఇండియాలో చేరింది గాని, అది ఎఱ్ఱసముద్రం మీదుగా పోయియుంటే, జనరలు అకింలేకుగారికి సకాలంలో మంచి చేదోడుగనుండి, పరిస్థితులను మార్చివేసియుండును. ఇంగ్లాండునుండి నౌకల గుంపు ఆఫ్రికాను చుట్టి గుడుహోపు రేవుమీదుగా ఉత్తర ఆఫ్రికా ప్రాంతాలు చేరుటకు మూడు నెలలు పట్టును. రోమెలుకి అట్లుగాక, నష్టానికి తెగించినా కావలసిన సరకు మూడు రోజులలోగా మధ్యధరా సముద్రం దాటించి తెచ్చుకోగలడు. జర్మను యుద్ధరంగాలు వారి దేశానికి చేరువగ నున్నందున, ఆ సదుపాయాన్ని మించుటకు సంయుక్త రాజ్యాల సప్లై రవానాలు యింకా ఎక్కువ వడిగా జరగాలి. మడగాస్కరు దీవి విషయమున ఇంగ్లాండు ఏమీ చేయలేకపోయిం దేమని కొందరడుగుచూ వచ్చిరి. ఇంగ్లాండు ఏమిచేయకపోలేదు. అతిరహశ్యంగా సైన్యం సరకూ మడగాస్కరుకి సకాలంలో చేరెను, అటు ఫిలిప్పైను దీవులలో జనరలు మకార్ధరుని ఒంటరిగా విడిచేరని అమెరికాలో యిదే సమయమున ఫిర్యాదులు వచ్చెను. కాని బ్రహ్మాండమగు యేర్పాటులు కొనసాగుచునే యుండెను. సైన్యం సరఫరాలుగూడ సకాలంలో ఆస్ట్రేలియా తీరం చేరినవి. కనుకనే ఇండియాకుగూడ ప్రమాద సమయమున సహాయానికి తగు సహాయం చేకూర్చ వీలయ్యెను. దూరదృష్టితో నిర్ణయించిన వ్యూహం ప్రకారం పనులు జరుగుటకు కొంత వ్యవధి యుండాలి. నేడు జరుగుచున్నవి కొన్ని నెలల క్రిందట దూరదృష్టితో గావించిన నిర్ణయముల ఫలితములే. నేటి ప్లానుల ప్రయోజనం కొన్ని నెలలు గడచిన పిమ్మట తెలియ గలదు.

ఈజిప్టు రక్షణ.

జూను 4 నుండి 6 వరకును, 13 వ తేదిని టొబ్రుకులో జరిగిన యుద్ధంలో చాల టాంకులు పోయినవని అధికార రీత్యా యిపుడంగీకరించబడెను. అనగా అచటనుండిన కవచ మోటారుదళంలో అత్యధిక సంఖ్య పోయిందన్నమాట. అందుచే, యిపుడు 8 వ సైన్యానికి, యెక్కువ సహాయం క్రొత్త ఆయుధాలువచ్చి చేరినవి, యింకా కొన్ని వస్తున్నాయని తెలియుటచే చాల ఉత్సాహంగా నుంది. బ్రిటిషు సేనాధికారులు తిరిగి తమ సకవచ దళములను కూడదీసుకొను వరకు, బ్రిటిషు వారి కాల్బలము ఫిరంగిదళం మాత్రమే బ్రిటిషు విమానాలు అమెరికా విమానాల సహాయంతో ఈజిప్టుపై జర్మను దాడి నరికట్టవలసి యుండును.

టొబ్రుకు నష్టం

మధ్యధరా సముద్రం తూర్పు భాగమునందు బ్రిటిషువారి సైన్యంగాని, నౌకా బలంకాని లేకుండాచేయుటే జర్మను సేనాని రోమెలుయొక్క ముఖ్యోద్దేశ మనుటకు ఎటువంటి సందేహం లేదు. జర్మను సేనలు కాకససుపై దాడిచేయుచున్నపుడు, వాటికి జోడీగా ఉత్తరాఫ్రికాలో తానీదాడి జరిపెను. ఉత్తరమున రష్యాపై దాడిలో సిబాస్టపూలు వశమగుట వారికెంత లాభమో, ఆఫ్రికాలో టొబ్రుకు వశమగుటగూడ వారికంత లాభమే. టొబ్రుకు నిరోధం తొలగినచో రోమెలు సేనలకు సరఫరా రోడు మార్గములో 300 మైళ్లు తగ్గును. ఈజిప్టులో అలగ్జాండ్రియా రేవునుండి మధ్యధరా సముద్రమునందు తూర్పు మధ్య భాగములకు పోవు నౌకా మార్గములన్నింటికి టొబ్రుకు పతనంవలన, సిరనైకాలోని విమానాశ్రయములు పోవుటవలన తీవ్ర ప్రతిబంధక మేర్పడును.

అలగ్జాండ్రియానుండి మాల్టాకు (820 మైళ్లు) పోవు నౌకలజట్టు, క్రీటు - సిరనైకాల మధ్య నున్న 175 మైళ్ల వెడల్పుగల సముద్రంగుండా పోవలెను. క్రీటులో జర్మను విమాన కేంద్రాలు గలవు. వాటికి యీ నౌకలను కొట్టుటే ఏకైక కార్యము. మొత్తం మార్గంలో మూడోవంతు ప్రయాణం యీ కాల్వవంటి సముద్రంగుండా జరుగవలసియున్నది, అపుడు జర్మను విమానాల పోరు తప్పదు. 8 వ బ్రిటిషు సైన్యం సిరనైకాలో నున్నపుడు, మన నౌకలకు తీరానయుండు ఫైటరు విమానాల రక్షణయుండేది. నౌకలు సిరనైకా తీరాన్ని అంటియే పోతూవుండేవి.

ఇపుడు మన ఫైటరు విమానాశ్రయాలు యింకా తూర్పున 100 మైళ్లు దూరమయి పోయినవి. ఇదివర కొసంగినంత రక్షణ యొసంగ జాలవు. శత్రు బాంబరు విమానాశ్రయాలుగూడ యిదివరకు కన్న తూర్పున మరో 100 మైళ్లు దూరమయినందున, యీ ప్రాంతంలో ప్రయాణంచేయు నౌకలకు రెండు వైపులనుండి విమాన దాడి ఒత్తిడియుండును. అలగ్జాండ్రియా రేవు యింతకాలం అనుభవించుచుండిన శాంతి తొలగిపోయి, విమానదాడులకు ఎక్కువ

గురికాగలదు. శత్రు విమానాశ్రయాలు చేరువయినందున సైప్రసు దీవి, హారిఫా రేవులకు మార్గాలకుగూడ నిరోధం కలుగునని, లండనులో అధికారులు తలంచుచున్నారు.

రష్యాకు మేలు.

ఇవి ఒప్పుకోక తప్పని విషయాలు. నేలను సముద్రంలోనుగూడ జరుగుచున్న యుద్ధాలలో మనం వెనుకబడుచున్నామన్న మాట. మన మిత్రదేశమగు రష్యాకు ఒత్తిడి తగ్గేటట్లు రెండో యుద్ధరంగం ప్రారంభింపకపోయినా, లిబియా యుద్ధం వలన యింకోవిధంగా తోడ్పడ్డామన్న మాట. తెల్ల సముద్రంనుండి హిందూ మహాసముద్రం వరకు వ్యాపించియున్న యుద్ధ రంగంలో ఎడమవైపు మనం కాచియున్నామన్న మాట. తాను స్వయంగా కష్టదశయందున్నపుడే లెక్కచేయక 8 వ సైన్యాన్ని మధ్య ప్రాచ్యమునందు సైన్యాలను జతకూర్చ గల్గిన బ్రిటను, ఇపుడు రష్యా సైన్యానికి దక్షిణానగల ప్రమాదాన్ని ఎదుర్కొనుటకు వెనుదీయదు. అది రష్యా దక్షిణద్వారమే కాక బ్రిటిషు తూర్పు ఆఫ్రికాకు, దక్షిణ ఆఫ్రికాకు ముఖ్య ద్వారము; యూరోపులోని అక్ష రాజ్యాలను ఏషియాలోని జపాన్ని వేరుచేయు చెలియలికట్ట.

వెనుకనున్న శక్తి.

మన నష్టాలు యీ రీతిగనున్నను ఈజిప్టు రక్షణకు తగిన శక్తి లేక పోలేదు. జనరలు వావెల్ ఇతోపియాలో నొక సైన్యమును, వెనుక లిబియా సరిహద్దులలో వేరొక సైన్యమును ఎదుర్కొన్నప్పటికన్న యిప్పటి స్థితి మేలుగనేయున్నది. మనకో మేలేమంటే, మన విమానాశ్రయాలు, సప్లయి కేంద్రాలు యిదివరకుకన్న చేరువై, సరకు చాలా చేరుచున్నది. అంతేకాక, చిన్న చిన్న ఫిరంగి దళములుపైన విమానాల సహాయంతోకూడా దాడివచ్చు టాంకులకు ప్రమాదకరమగు నిరోధములుగ యీ విమానాశ్రయా లుండగలవు.

అక్షరాజ్యాల ఆఖరు విసురు

రానున్న నెలలలో అక్ష రాజ్యాల సేనలు తమ శక్తికొలది పోరి కాకసను నాక్రమించుటకు ప్రయత్నించక మానవు; ఏమన యిదే వారి ఆఖరు అవకాశము, ఉత్తరాన రష్యనులకు, దక్షిణాన బ్రిటిషువారికి ఘట్టిదెబ్బలు తగులవచ్చును. బ్రిటిషు సామ్రాజ్యం సేనలును ప్రజలును, సోవియటు యూనియను యీ రాపిడిని పట్టుదలతో నెదుర్కొనగలవు.

నిరుత్సాహం అనవసరం.

రెండు స్వతంత్ర విమర్శలు వినవచ్చినవి. పడమటి ఎడారియందున్న ఆస్ట్రేలియా విలేఖరి యిట్లు వ్రాసెను: 8 వ సేనానాయకులు నిరుత్సాహం చెందలేదు. అంతకన్న సూయజుకాల్వ రక్షించుచున్న సైనికులుగూడ అధైర్యం చెందలేదు."

దక్షిణాఫ్రికా సేనాని స్మట్సుగారు, టొబ్రుకులో తమ సేనల నష్టంగూర్చి విన్నమీదట, "యీ సేనలును, యింకముందు దక్షిణాఫ్రికా పంపు సేనలును, ఈజిప్టు రక్షణయందు చాల ప్రాధాన్యత వహించి, ఈజిప్టును రక్షించి, చివరకు లిబియాను అక్షరాజ్యాలనుండి తిరిగి తీసుకొనుటయందు బాగుగ తోడ్పడగలవు. దక్షిణాఫ్రికా వాటిని తీసుకొని పగసాధించగలదు" అనిరి.

# "ఏషియా జపానువారికే"

## యేషియా యేషియా వాసులకే యను జపాను ప్రచారం యొక్క అంతరార్థం.

"ఏషియాదేశం ఏషియావాసులకే యుండాలని జపాను కొంతకాలంనుండి విపరీతంగా ప్రచారం చేస్తున్నది. దానియొక్క అంతరార్థం జపాను సైన్యాలాక్రమించిన దేశాలలో సువిదితమగుచున్నది." అని న్యూయార్కు టైమ్సు పత్రిక జూను 26 వ తేదిన సంపాదకీయ వ్యాసం వ్రాసింది.

తా నాక్రమించిన దేశాలలో జపాను సేనలు అపుడే లూటీ ప్రారంభించి, అచటి ప్రజలపై ఆర్థికాధికారము విజ్ఞానాధికారమును వహించుచున్నారని విదేశాలనుండి వస్తున్న రేడియో వార్తలు సేకరించి వాషింగుటను (అమెరికా) నగరంలోని యుద్ధ కార్యాలయంవారు ప్రకటించిరి.



ఎటువంటి నేలైనా సరే, బ్రిటిషు బ్రెనుగను కారియరులకు అడ్డులేదు. మరఫిరంగులను మోసే యీ యంత్రాలు టాంకులవలె నిర్మింపబడి, ఉక్కు కవచం కలిగి, ఎటువంటి ఏగుడుదిగుడు నేలనైనా బహువడిగా పోగలవు. ఉత్తర ఐర్లాండులో పోవుచున్న ఒక యంత్రం యిందు కలదు.

---

"బర్మాలోను, మలయాలో, డచ్చి తూర్పు దీవులందును, జపాను సేనలవెంట ప్రచారకులు, బ్యాంకరులు, పరిశ్రమల యజమానులు వర్తకులును, బాగా తరిఫీదయిన గుమస్తాల గుంపు వచ్చి క్రొత్తగ ఆక్రమించిన దేశాన్ని టోకియో ప్రభుత్వానికి అనుకూలంగా పరిపాలించుచున్నారు. యుద్ధపు పొగలు యింకా తరలిపోకముందే, విశాలప్రాచ్య ఆశియా అభివృద్ధి కార్పొరేషను యొక్క అడతిదారులు ఆ దేశాలకు వచ్చి తమకు మంచి అనుకూలమయిన స్థలాలు భవనాలు తీసుకుంటున్నారని" అమెరికా యుద్ధ సమాచార కార్యాలయం వారు తెల్పుచున్నారు.

యొకహోమా స్పీషీ బ్యాంకు (జపాను సంస్థ) ఏజెంట్లువచ్చి బాంకింగు పరిశ్రమలు వాణిజ్యం అన్నింటిని స్వాధీనపరచుకొన్నారు. మిలిటరీ నాణెముల పద్ధతి అమలుజరిపి, యిప్పుడున్న నాణెములు పనికిరాకుండా చేసిరి. క్రొత్త నాణెములు వారు తెచ్చినవే గనుక వాటితో జపానువారు తమకు కావలసినవన్నీ కొనివేస్తున్నారు.

ఇదిపుడు పరిపాటయింది. చీనాలో ఒక భాగం జపాను ఆక్రమించి, అచట వాంగుచింగు వైగారి కీలుబొమ్మ ప్రభుత్వమును స్థాపించినప్పటినుండి, జపాను ప్రచారంచేస్తున్న ఆదర్శ వాక్యంయొక్క నిజమయిన అర్థం వెల్లడయింది, "ఏషియా ఏషియా వాసులకే" అంటే "ఏషియా జపానువారికి" అన్నమాట.

---

## సైనికోద్యోగుల నెంచుటకు త్వరిత విధానం

భారతదేశంలో నేల నావిక విమాన సైన్యములందు కమిషను ఉద్యోగులకు అభ్యర్థులను ఎంచుట యింకను త్వరగ జరుగుటకై సెంట్రలు ఇంటర్వ్యూ బోర్డు నొకదానిని ప్రభుత్వంవారు తయారుచేసిరి. ఇకముందు యిందుకొరకు ఇండియాను మూడు భాగాలుగా విభజింతురు:— ఉత్తరం, మధ్య, దక్షిణం డివిజనులు.

అభ్యర్థులను సందర్శించి పరీక్షించి ఎంచు యీ యింటర్వ్యూ బోర్డులు ఉత్తర డివిజనుకి డెహరాడూనులోను, మధ్య డివిజనుకి జబల్పూరులోను, దక్షిణ డివిజనుకి పూనాలోను జూలై 6 వ తేదినుండి సమావేశమగుదురు. దక్షిణ డివిజను విమానదళం అభ్యర్థులను ట్రావెలింగు విమాన దళం వైద్య సంఘంవారు పూనాలో ఆగస్టు 8 నుండి 18 వరకు పరీక్షింతురు.

# 1940 జూను నుండి 1941 జూను వరకు.

## బ్రిటను ఒంటరిగా పోరాడిన కాలం.

యుద్ధంలో పూర్తిగ నిమగ్నమై పిల్లాది మొదలు బ్రిటనులో ఎట్లు పాటుబడుచున్నారో నుడువుచు అమెరికాలో బ్రిటిషు రాయబారిగనున్న హాలిఫాక్సు ప్రభువుగారు తెలిపిన కొన్ని యదార్థ విషయములును సంఖ్యలును చాల నమ్మకంగా నున్నాయి. బ్రిటను నిర్లక్ష్యం చేస్తున్నదను వదంతి ఖండించునట్టి యీ సంఖ్యలు విన్నవారందరికి నమ్మకం కలిగించగలవు. అక్షరాజ్యాల ప్రచారానికి బానిసలగు వారిమాట మాత్రం చెప్ప లేము. 9,396 జర్మను ఇటాలీ విమానాలు పడగొట్టబడినవి, 5,250,000 టన్నుల శత్రు వర్తక నౌకలు ముంచబడినవి ; అక్షరాజ్యాల యుద్ధనౌకలు పదులు వందలు ముంచబడినవి ; 1941 రాబడిలో నూటికి 60 వంతు యుద్ధానికి ఇంగ్లాండు ఖర్చు చేసిందని హాలిఫాక్సుగారు తెలిపిరి.

కాని ఇంగ్లాండు ఒంటరిగ యుద్ధంచేసిన సంవత్సరం అదేనని స్పష్టంగా హాలిఫాక్సు ప్రభువు గారు తెలుపలేదు. 1940 జూనులో ఫ్రాంసు పడిపోయినప్పటినుండి 1941 జూనులో రష్యాపై జర్మనీ దాడి ప్రారంభించేవరకు, ప్రపంచ స్వాతంత్ర్యమును ఇంగ్లాండు ఒంటరిగ రక్షించవలసి యుండెను.

ఆ ఏడు జర్మనీ ఇటలీలు రెండింటితో బ్రిటను యుద్ధం సాగించెను. ఫ్రెంచి నౌకాదళమును, ద్రోహంచేసిన విషీ ప్రభుత్వాన్ని ఓకంట జూచు చుండెను. దూరప్రాచ్యమునందు తమ సైనిక కేంద్రాలపైని, వాటి సరఫరా మార్గాలపైన జపాను వలలు పన్నుచుండెను. మధ్యధరా సముద్రం కందిరీగల పుట్టవలె చెలరేగియుండ, దాన్ని ఒంటరిగా ఎదుర్కొనవలసి యుండెను. లిబియాలో విశాలమగు ఎడారులను ఒంటరిగ రక్షించుకొనవలసియుండెను. అమెరికాకు నౌకామార్గాలను బ్రిటిషు నౌకలే కాపలా కాయుచుండెను. అన్నింటిని మించి జర్మను విమానదాడులను ఎదుర్కొనవలసి యుండెను.

హాలిఫాక్సు ప్రభువుగారు ఆమెరికావారిని దయాభిక్ష వేడలేదు. లేకుంటే ఆ ఒంటరిగా నున్న ఏడాది కష్టాలు వర్ణించియుండును. జర్మను విమానాలు 1940 లో లండనుపై చరిత్రాత్మకమగు దాడిచేయుట, మే నెలలో పార్లమెంటు భవనములను వెస్టుమినిస్టరు చర్చిని క్రూరంగా బాంబులువేసి కొట్టుట, 1941 లో బాల్కను రాజ్యాలపై దాడిచేసినపుడు గ్రీసు, యుగోస్లావియాలకు ఇంగ్లాండు సహాయంచేయుట, యివన్ని ఆతడు వర్ణింపలేదు.

మార్చి నెలలో అరువుకౌలు చట్టం అమెరికాలో ఆమోదించబడెను. జూను మాసంలో రష్యాసేనలు యుద్ధంలోదిగి బ్రిటనుపైగల భరింపరాని భరువును తగ్గించినవి. కాని డంకిర్కు యుదంతం జరిగిన పిదప 12 నెలల వరకు, బ్రిటను ఒక్కటే అక్షరాజ్యాల వెల్లువను అరికట్టెను. బ్రిటను ఆ ఒక్కయేడు ఒంటరిగ యుద్ధం కొనసాగించకుండినచో స్వాతంత్ర్య సౌధములన్ని యీపాటి కూలుటో బీట వేయుటో జరిగి యుండును.

హాలిఫాక్సు ప్రభువుగారు సూచించిన సంఖ్యలు అంశములు ఆ ఏడాదిగూర్చి గావు, సింగపూరు పతకముందే, ప్రపంచాన్నంతా స్వాధీనం చేసుకోబోతున్న సైన్యాలను ఇంగ్లాండు ఒంటరిగా యెదిరించి, వారించెను.

---

## అతిథి నిర్బంధము

ఇండియాలో దేశరక్షణకొరకు క్రొత్త ఉద్యోగులను సైన్యాలకు తెచ్చుటచేతను, దూరప్రాచ్యమునుండి అనేక వేలమంది రక్షణార్థులు వచ్చుటచేతను, ఉండుటకు తావు చాలకుండా యుంది. కావున అవసరమగు తావులందు కొంద రిండ్లలో అతిథులను ఉంచుట నిర్బంధంచేయుటకు అధికారం ఒసంగుచు, ఇండియా డిఫెన్సు నిబంధనలు సవరింపబడినవి. ఇంట్లో నుండువారి హోదా, జాతి, మతములకు విరుద్ధమయినవారు ఆ యింటిలో నున్నవారి అనుమతిలేకుండా ప్రవేశ పెట్టబడకుండునట్లు శ్రద్ధ వహించబడును.

## ఇండియాలో డబ్బా ఆహారాల పరిశ్రమ.

సిపాయిలకు యిచ్చు ఆహార పదార్థములలో డబ్బాలలో నిలువా యుంచు ఆహారపదార్థములు ఇండియాలో తయారయినవి యిపుడు యిదివరకు కన్న యెక్కువగనున్నవి.

గత యుద్ధంలో మెసపటోమియాకు ఆవులు ఎగుమతి చేయబడినవి. అప్పటికి యిప్పటికి చాల తేడాగలదు. ఇపుడు జున్ను, ద్రాక్ష మున్నగు ఎండు ఫలములు, కాయగూరలు, బంగాళాదుంపలు, కోడిపిల్లల మాంససారం, యిత్యాది పదార్థాలు డబ్బాలలో చెడిపోకుండా నుంచే పరిశ్రమ బాగా యీ దేశంలో అభివృద్ధి చెందినది. ఇపుడు యుద్ధరంగాలలోనున్న మన సిపాయీలకు సత్తువనిచ్చే వివిధ పదార్థాలలో యివి కొన్ని. 4,000 టన్నుల ఎండు ఫలములు, 300 నుండి 400 టన్నుల డబ్బాలలోని జున్ను ; ఇండియా సప్లయి చేయగలదు. నిలువా ఉర్లగడ్డలు 23,000 టన్నులు తయారుకాగలవు. ఏడాదికి 62,000 రెన్నటి బిళ్ళలు కూడ ఇండియాలో తయారు కాగలవు. కాయగూరలు 1,000 టన్నులు, 5,000 టన్నులు గోల్డెను సిరపు, 2,500 టన్నుల మార్గరీను (మార్వ నెయ్యి) ఇండియా సప్లయి చేయగలదు.

## "ఉపయుక్తమగు రెండో రంగం."

### లిబియా యుద్ధంయొక్క లాభం.

మహా యుద్ధం జరుగుచున్నపుడు, అచ్చటచ్చట ప్రత్యేక రంగాలలో జరుగుచున్న యుద్ధముల ఫలితాలు, మొత్తం యావత్ప్రపంచ పరిస్థితుల ననుసరించి గమనించి, వాటి మంచిచెడ్డలు నిర్ణయించాలి. క్రిమియా ద్వీపకల్పంపైని, లిబియాపైని ఒకేసారి శత్రువు దాడిచేయుటబట్టి జర్మనులు నల్ల సముద్రంపైని, మధ్యధరా సముద్రంపైని అధికారం తీసుకో జూచుచున్నారని తెలియగలదు. టర్కీని కేటాయింపుచేసి, నల్ల సముద్ర మార్గమగు జలసంధిగుండా తమ యుద్ధ నౌకలకు దాధారి సౌకర్యము లేర్పరచుకొని, కాకసను రాష్ట్రమునకు అందలి నూనెగనులకు క్రొత్త మార్గము లేర్పరచుకొనుటకును జర్మనీ ఉద్దేశించినది. ఈజిప్టులో శత్రువు ఓడించబడినచో యీ ఉద్దేశాలన్ని పటాపంచలగును, లిబియా యుద్ధం వలన ఒక మేలుగలదు. శత్రువుకి రెండోవైపు యుద్ధరంగంగా లిబియా పనికివచ్చింది. జర్మను పాంజారు (సరి క్రొత్త రకం టాంకులు) డివిజనులు కొన్నింటిని యీ వైపు ఆకర్షించుటచే రష్యనులకు జర్మను ఒత్తిడి తగ్గింది. లేకున్న యీ పాంజరులు, టాంకులు, టాంకు విధ్వంసక ఫిరంగులు, అన్నీ రష్యాపై ఉపయోగింపబడేవి. అంతేకాక జర్మను విమానాలు అనేకం లిబియాలోను, మాల్టాలోనున్న బ్రిటిషువారి విమానదళంతో ఢీకొనుటకు దక్షిణమునకు మరల్చవలసి వచ్చెను. ఈ రీతిగా లిబియా యుద్ధం రష్యాకు మహాయుద్ధంలో తోడ్పడెను.

## పరిశోధకులకు ఆహ్వానం.

యుద్ధ ప్రయత్నములకు తోడ్పడునట్టి క్రొత్త సూచనలు 270 సప్లై డెవలపుమెంటు కమిటీ వారికి గత ఏనిమిది నెలలలో అందినవి. అందు 12 సూచనలు దేశరక్షణ శాఖలందు అనుసరించబడెను ; పది సూచనలు యింకను పరిశోధనకు ఇంగ్లాండునకు పంపబడెను ; 7 ఇండియాలో పరీక్షింపబడుచున్నవి, 123 క్రొత్త సూచనలను నిపుణ సంస్థల పరిశీలన యందున్నవి.

కమిటీ సప్లయి డెవలపుమెంటు అన్నది, గత సాలాంతమున స్థాపించబడినది. యుద్ధం చేస్తున్న సర్వీసు లన్నింటికి కావలసిన క్రొత్త వస్తువులు స్టోర్సు సేకరించుటకు, వాటి సప్లయి అభివృద్ధిచేయుటకు క్రొత్త సూచనలు పరిశోధనలు తెలియజేయబడినచో వాటిని విచారించుటకు ఇది ఉద్దేశింపబడినది.

సివిలు ప్రజలు చాల పరిశోధనలుచేసి సూచనలను పంపిరి. అందు సగానికి పైగా విమానముల సంబంధించినవై యున్నవి. ఈ విమానాలనుగూర్చి అన్ని దేశాలలో అనుభవంగలవారు నిపుణులు ఎందరో పరిశోధనలు చేయుచున్నారు. కనుక ఆ విషయమున లోపమేమి యుండదు. ఆ వృత్తిలో లేనివారు ఆ విషయమున క్రొత్తవి కనిపెట్ట నవసరంవుండదని కమిటీవారు సూచించుచున్నారు.

(1) ఇపుడు దొరకని వస్తువులకు బదులుగ యింకేమయిన వస్తువులు కనిపెట్టుట, (2) ఇపుడు వృధాచేయబడుచున్న సరకు ఏదేన మంచి కార్యములకు ఉపయోగించవచ్చునా ? (3) లోహాలు, మొలకలు, మున్నగు ప్రకృతి సంపదను యుద్ధానికి క్రొత్త విధంగా ఉపయోగించుటకు వీలున్నదా ? ఈ విషయాలగూర్చి విజ్ఞానవంతులు శాస్త్రిజ్ఞులు పరిశోధించుట మంచిది. ఇండియాలో కొన్ని ప్రాంతాలలో విపరీతంగా పెరుగుతుంగలోనుండి, ఎన్నో ముఖ్యమగు వస్తువులు చేయవచ్చునని యిటీవల కనిపెట్టబడెను. అటువంటి క్రొత్త సూచనలు ఎంతో లాభకరంగానుండును.

లాభకరమగు సూచనలు చేయువారికి, క్రొత్తవి కనిపెట్టినవారికి మంచి లాభముండును. అధికారులు సూచన అంగీకరించగానే అతనికి తెలియజేతురు. ఆతడు పేటెంటు చేసుకొనుటకు దరఖాస్తు పెట్టుకోవచ్చును, లేదా యుద్ధానంతరం బహుమతి కోరవచ్చును.

క్రొత్త భావాలు సూచనలు, కార్యదర్శి, జనరలు హెడుక్వార్టర్సు, సప్లయి డెవలపుమెంటు కమిటీ, హైదరాబాదు పాలసు, న్యూ ఢిల్లీ, అని వ్రాయవలెను.

## రక్తదానము.

విమానదాడి జరిగితే దెబ్బతిని గాయాలుపడిన వారికి రక్తం పోతుంది. వారికి యితరుల రక్తం వొంట్లో ఎక్కిస్తే బ్రతుకుతారు. అందుకొరకు రక్తం కావలసియున్నది. ఇండియాలో ప్రతీ రాష్ట్రంలో దృఢకాయులు రక్తం దానంచేస్తే పుచ్చుకొని, చెడిపోకుండా దాన్ని భద్రపరచే వైద్య చికిత్స స్థానాలు ఏర్పాటుచేసేరు. వాటిని “ బ్లడు బ్యాంకు ” అంటారు. అట్లు రక్తాన్ని భద్రపరచే యంత్ర సాధనలన్ని జతకూర్చబడినవి. రక్తం యిచ్చేవారే ఎక్కువగ కావలసియున్నది. ఇందు నిమిత్తం రెండు డ్రై బ్లడు ప్లాస్మా యంత్రాలుగూడ విదేశాల నుండి తెప్పిస్తున్నారు. ఇంకొకటి ఇండియాలోనే తయారు చేస్తున్నారు.

# నాజీ తుపాను.

ఈ రోజున రష్యాలో యుద్ధం చండప్రచండంగా జరుగుచున్నది. కర్స్కు యుద్ధరంగంలోను, బెయిల్‌గరాడ్ రంగంలోను, వాల్గాన్స్కు రంగంలోను యుద్ధం అతితీవ్రంగా సాగుచున్నది. జర్మను నాజీ సేనలు అత్యంత భీకరంగా రష్యను సేనలతో హోరాహోరిగా అహోరాత్రాలు పోరాడుచున్నవి, వేలకువేలుగా జర్మను సైన్యాలు ఆహుతి అవుతున్నాయి. ఒక్కచోట ఒక్క యుద్ధరంగంలోనే 22 వేల జర్మను సైనికులు చచ్చిపడియుండిరి. ఇతర రంగములలోకూడా లెక్కిస్తే ఇంకా ఎన్ని వేలమంది లెక్క తేలగలరో ఊహించుకోండి. జూలై 4 వ తేది మొదలు 3 రోజులవరకు జరిగిన యుద్ధంలోనే యింతమంది జర్మనులు మరణించిరని వార్తలు వచ్చినవి. యుద్ధం ఇంకా మహోగ్రంగానే అక్కడ సాగుచున్నది. జర్మను సేనలు తండోపతండములుగా వచ్చిపడుచున్నవి. వేలకొలది జర్మను టాంకులు యుద్ధరంగంలోనికి ప్రవేశించి అగ్నివర్షం కురిపించుచున్నవి. వేలకొలది జర్మను విమానాలు యుద్ధరంగంలో జర్మను సేనలకు వెన్వెంటగా పైన ఆకాశ యుద్ధం చేయుచు, రష్యనులపై బాంబుల వర్షం కురిపించుచున్నవి. జర్మనుల తాలూకు నిల్వ పటాలములుకూడా యుద్ధరంగంలోనికి పంపబడుచున్నవి. ఇటువంటి ప్రచండమైన జర్మను సేనల ధాటికి రష్యను సేనలు ఎదురు నిల్చి దెబ్బకు దెబ్బకొట్టుచునే యున్నవి. విధివిరామంలేకుండా శత్రువును ధిక్కరించుచునే యున్నవి. కాని, శత్రు సేనలు అత్యుగ్రంగా చెలరేగి, చెలరేగి, మలమలమాడిన తర్వాత, లక్షోపలక్షలుగా, లయమైన తర్వాత, బిగువు సడలించి రష్యనులు కొలదిగా వెనుకకు మరలు

చున్నారు. దీనిని బట్టి చూస్తే, రష్యను యుద్ధ తంత్రంవల్ల జర్మను సైనికబలం చాలాకాలం ఇదేవిధంగా విజృంభించగలదా అనే అనుమానం కలుగుతోంది.

జర్మను సేనలు చాలా బ్రహ్మాండంగానే యుద్ధరంగంలోనికి దూకుచున్నవి. ముందు వెనుకలు చూచుకొనకుండానే హిట్లరు తన సేనలను అపారంగా రష్యామీదకు దండెత్తించుచున్నాడు. కాని, ఇంత నిర్లక్ష్యంగా యుద్ధం ఎంత కాలం సాగించగలడు? అనే సంగతి బాగా ఆలోచించాలి. నాజీ సేన ఎన్ని రోజులు యీవిధంగా ఆహుతి కాగలదు? మూడు రోజులలో ఒక్క రంగంలోనే 22 వేల మంది నాశనమైనారు. మిగిలిన రష్యను రంగములలో కూడా నాశనమైన నాజీ సేనలను లెక్కించినట్లయితే ఒక్క రోజులోనే 22 వేల మంది జర్మనులు హతులైనట్లుగా లెక్క తేలగలదు. రోజు 1 కి అధమపక్షం 20 వేల మంది జర్మనులు హతులైనప్పటికీ, అయిదు రోజులలో లక్ష జర్మను సేన నాశనంకాగలదు. ఒక్కొక్క వారం రోజులలో లక్ష సేన చొప్పున నాశనమైనప్పటికీ, నెల 1 కి 4 లక్షల జర్మను సేన నాశనం కాగలదు. రెండు మాసాలు యీరీతిగా జర్మనులు హతమైతే చాలు. 10 లక్షల జర్మను సేన నాశనం అయిపోతుంది. రష్యను యుద్ధ తంత్రం అంటే ఏమిటో బోధపడుతుంది అప్పుడు.

జర్మనులకు ఇదివరకే కొన్ని లక్షల సేన, చాలా ప్రశస్తమైన సేన నాశనమైనది. జర్మను సైనిక బలం నాశనం అవుతున్నకొలదీ, జర్మనీకి అంత్యకాలం సమీపించుచున్నదని అర్థం చేసుకోవలెను. ఆత్మబలం క్షీణించుటవల్లనే అంత్యకాలం ఆసన్నమవుతుంది. 20 వేల సైనికులు ఒక్క రోజులో మరణించారంటే అర్థమేమిటి? ఒక డివిజను సేన ఒక్క రోజులో నాశనమైనదని అర్థం. రోజుకొక డివిజను సేన చొప్పున నాశనమవుతూ ఉంటే, నాజీ బలం సర్వనాశనం అగుటకు ఎంతోకాలం పట్టదు. రష్యాలోని కాకసను పరగణాలోనికి ప్రవేశించి ఆక్రమించుటకొరకై, హిట్లరు యీ వీరావేశంతో ముందువెనుకలు చూడకుండా, బ్రహ్మాండ భాండము లదిరిపోవునట్లుగా ఫిరంగులను కాల్చి, బాంబులను పేల్చి, తన ప్రతాపం చూపిస్తున్నాడు. ఎంత ఎగిరిపడుతున్నాడో అంత అధోగతి పాలవుతాడు.

రష్యా యుద్ధంలో రష్యను సేనలు మాత్రం నష్టపడుట లేదా అని ప్రశ్నించవచ్చు. కాని, రష్యాకుగల జనసంఖ్యలో సగం వంతుకూడా జర్మనీకి లేదు. రష్యా అనేది బ్రహ్మాండమైన దేశము. ఇటు అయిరోపా ఖండంలోనుంచి అటు ఆసియా ఖండంలోనికి విస్తరించియున్నటువంటి 82 కోట్ల చదరపు మైళ్ల వైశాల్యంగల రాజ్యము. ప్రపంచంయొక్క మొత్తం వైశాల్యము 556 కోట్ల చదరపు మైళ్లు. అందులో ప్రపంచమందలి సముద్ర ప్రాంతం మినహాయిస్తే లెక్క తేలిన భూప్రదేశం సుమారు 185 కోట్ల చదరపు మైళ్లు మాత్రమే. అందులో రమారమి సగం భూప్రదేశం రష్యా రాజ్యంలో ఇమిడివున్నది. ప్రపంచంలోని సగం భూప్రదేశము రమారమిగా రష్యా రాజ్యమైయున్నది. ఉత్తర ధృవ ప్రాంతంవరకు విస్తరించిన దేశం. ఉత్తరపు వైపున ఆర్కేంజెక్ అనే రేవులోను, మూర్మాంస్క్ అనే రేవులోను బ్రిటిష్‌వారు అక్షయంగా అపారంగా ఆయుధ సామగ్రులను రష్యా సహాయార్థమై దిగుమతిచేసి సప్లయి చేస్తున్నారు. ఆ రేవులలో ఎడతెగకుండా టాంకులు, ఫిరంగులు మందుసామగ్రులు దిగుమతి అవుతున్నాయి. అచటి సముద్రం పేరు తెల్లసముద్రము. ఆ రేవులను ఆక్రమించుకోవలెననిన్నీ రష్యాకు ఆయుధ సామగ్రులు సప్లయి కాకుండా చేయవలెననిన్నీ జర్మనులు విశ్వప్రయత్నం చేసారు. కాని, ఆ పని జర్మనులకు సాధ్యం కాలేదు. రష్యాకు ఉత్తరంగావున్న యీ తెల్ల సముద్ర ప్రాంతంలో గెలువలేక తెల్ల మొగము వేసిన శత్రు సేనలు రష్యాకు దక్షిణంగా వున్న నల్లసముద్రంలోనికి వచ్చి సెబాస్టపూలు రేవును ఆక్రమించుకొనుటకు అహోరాత్రాలు యుద్ధం చేసి అడుగుపెట్టగల్గినవి. ఈ నల్లసముద్ర తీర ప్రాంతంలోనే కాకసను పరగణా రష్యాలో వుంది. ఈ కాకసను పరగణాలోనే బ్రహ్మాండమైన కిరసనాయిలు గనులు ఉన్నవి. పరిషియా రాజ్యంలోనుంచి యీ కిరసనాయిలు గనులున్నటువంటి కాకసను పరగణాలోనికి చక్కని రాజమార్గం వున్నది. ఈ రాజమార్గం యావత్తూ బ్రిటిష్ సేనలచేత ఆక్రమింపబడి రక్షింపబడుతున్నది. ఈ రాజమార్గంగుండా రష్యాకు

ఆయుధాలు విశేషంగా అమెరికావారివల్లను బ్రిటిష్‌వారివల్లను సప్లయి చేయబడుచున్నవి. ఈ పరిషియాలోనికికూడా ప్రవేశించాలనే సంకల్పం శత్రువులకు లేకపోలేదు. పరిషియాలోనికి పోవుటకొరకై యీజిప్టుమీదుగా సూయజు కాల్వవరకు ముందగా చేరాలి. సూయజు కాల్వ ఎర్రసముద్రంవద్ద వున్నది. అందువల్ల తెల్లసముద్రంలో ఓడిన హిట్లరు, నల్లసముద్రంలోకి వచ్చి, నల్లసముద్రతీర యుద్ధంలో నలిగి నల్లేరు కాడ అవుతున్నాడు. నల్లసముద్రం మీదుగా కాకసను పరగణాలోనికి ప్రవేశించజాలనేమో అనే భయంచేత, సూయజు కాల్వవద్దనున్న ఎర్ర సముద్రముమీదకు కూడా పోవలెనంటున్నాడు.

రష్యాకు తూర్పు సరిహద్దులో, ఆసియా ఖండంలోకూడా రష్యాకు సముద్రతీరం వున్నది. అక్కడ పచ్చసముద్రం జపానుకు సమీపంగా వుంది. తన జర్మను సేనలు ప్రత్యేకంగా రష్యాను జయించలేకపోతే, తనకు అండగా నున్న జపానునుకూడా పచ్చసముద్రంలోనుంచి విజృంభించవలసినదిగా హిట్లరు కోరవచ్చును. జపానుకూడా రష్యాపై విజృంభిస్తేనే తప్ప, తాను ఒక్కడే ఏకాకిగా రష్యాను జయించలేననే భయం హిట్లరుకు వుంది. కాబట్టి, హిట్లరు యొక్క నాజీ జర్మను సేనలు తెల్లసముద్రంలో తమ ఆట సాగక నల్లసముద్రంలోకి వచ్చినా, ఎదురుగా ఎర్రసముద్రమే ప్రత్యక్షమౌతూ వున్నది. రక్తప్రవాహాలలో జర్మను సేనల శవాలు తేలుతున్నాయి. ఈ ఎర్రసముద్రమును దాటలేక, పచ్చసముద్రంలోని జపానుయొక్క సహాయమునుకూడా కోరవలసివస్తోంది.

బ్రహ్మాండమైన రష్యా రాజ్యం విస్తారమైన ఊడలు దిగిన మర్రిచెట్టువలె విస్తరించి వుంది. ఈ వటవృక్షము యిదివర కెటువంటి తుపానులు కైనా చలించలేదు. ఈ జర్మను నాజీ సేనల తుపాను గాలికి చలిస్తుందా? తుపాను గాలి ప్రచండంగా ఎంత కాలం వీచగలదు? ఆ తుపాను గాలి ఎంత విస్తారంగా వీస్తుందో, అంత స్వల్ప కాలంలో సమాప్తమౌతుంది. ఆ తుపాను గాలివల్ల ఎన్ని చిన్న రాజ్యాలు, ఎన్ని సామాన్య వృక్షాలు కూలి పడిపోయినప్పటికీ, రష్యావంటి మహా వటవృక్షములు చలించేవి కావు. ఈ నాజీ తుపాను బ్రహ్మాండమైనదే. కాని ఈ రష్యా వటవృక్షం అక్షరాజ్యాల తుపానుకు చలించేది కాదు. ఇదే మిత్రమండలి యుద్ధ తంత్ర పరమార్థం.

---

## మద్రాసు పటాలముల జనహాని.

మదరాసు పటాలములో యీ దిగువ జనహాని కలిగిందని తెలుపుటకు విచారించుచున్నాము :—

జూన్ నెల 19 వ తేది యుద్ధ సంచికయందు మద్రాసు పటాలముల జనహాని కట్టీ తప్పుగా యుండుటువలన యీ క్రింద కనుబఱచిన పట్టిక దానికి బదులుగా చదువుకోనవలెను :—

నెంబరు. హోదా. పేరు.

గాయపడినవారు.

ఐ. హెచ్. సి.—

188812 కుట్టుపని ... కె. నాగయ్య.

కనబడనివారు.

181529 మంగలి ... లక్ష్మణన్.
హెచ్/192253 ఎ/వంటవాడు. అంబిక.
హెచ్/193417 ఎం/వంటవాడు. అప్పాదురై.
హెచ్/ 19274 ఎస్. కె. సిపాయి. ఎస్. ఎన్. చక్రవర్తి.
హెచ్/189018 నౌఖరు ... దేవసహాయం.
హెచ్/193416 వంటవాడు ... సందానస్వామి.
హెచ్/167122 వంటవాడు .. తంబుస్వామి.

చనిపోయినవారు.

ఐ.ఎ.ఓ సి.—

ఒ/121964 లాంసునాయక్. ఓ.ఎ. పద్మనాభన్.

కనపడనివారు బహుశ యుద్ధ ఖైదీగానుండవచ్చును.

ఆర్.ఐ ఎ ఎస్ సి.—

ఒ/71221 సిపాయి .. ఎన్. మాముందిసామి.

అదివరకు కనబడక యిపుడు కనబడినట్లు తెలిసినవారు.

మదరాసు సేపర్లు, మైనర్లు—

63720 సేపరు కృష్ణస్వామి నాయుడు
60170 సేపరు ... మాడచెట్టి.

ఇండియను ఇంజనీర్లు—

63633 సేపరు .. గోవిందస్వామి
63056 సేపరు ... కె. కుంచిరామ నాయరు.
62600 సేపరు ... రాజూ.
63153 సేపరు ... రామచంద్రా రెడ్డి.

అదివరకు కనబడక యిప్పుడు చనిపోయినట్లు తెలుపబడినవారు.

మదరాసు సేపర్లు, మైనర్లు—

63559 సేపరు .. పరశురామను.

MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.